

### కమ్మవిద్యార్థి సహాయసంఘము

కమ్మవిద్యార్థి సహాయసంఘమువారికి యీ నెలలో జరిగిన వివాహములలో చదివించబడి పంపబడిన కట్నముల వివరములు:—

౧ కొణ్ణూటి అప్పయ్యగారి కుమారుడు శం కరయ్యచౌదరికిని చిరంజీవుల కొపురం శాఖ మూరివెంకయ్యగారి సోదరి జానకమ్మకును జరి గిన వివాహసందర్భములో

వధుపుత్రరపునుండి బండీలు ౨౫—౦—౦
వరుని తరపునుండి „ ౧౦—౦—౦

| | |
|---|---|
| ౨ చిరంజీవుల శివాను వెంకటగిరి కొపురపుడు కుర్పూరు శేషయ్యగారి కూతురు వివాహసంద ర్భములో | ౫—౦—౦ |
| బండి రు: | ౪౦—౦— |

పైకట్నములు శ్రీయుత శాఖమూరిరాఘవ య్యచౌదరిగారి ప్రోత్సాహమువల్ల చదివింపబ డి కార్యస్థానమునకు పంపబడినవని తెలియబ రచుటకుచాల సంతోషము. యీమాదిరి కమ్మ వారివివాహములన్నిటిలోను తప్పక కట్నముల నుపంపుదురని నమ్ముచున్నాము. యీకట్న ములు చదివించినమహాశయులు ఆదర్శకపురు షులైనందుకు మాకృతజ్ఞతావందనము లర్పించు చున్నాము.

ఇట్లు
క. వెంకయ్యచౌదరి
మేనేజరు, క.వి.స. సంఘము

## ఆంధ్రవాఙ్మయ సేవాసమితి

(బూర్గంపాడు)

ఈశ్వరసంవత్సర చైత్రశు॥ ౧ తేదీన పైస మితి యీప్రాంతీయ సారస్వతాభిలాషులగు కొందరిచే నెలకొల్పబడి తత్ప్రారంభ స మావేశము జయప్రదముగ జరిగింపబడినది. స మితిస్థాపకులు, సమితియుద్దేశములను, కా ర్యవిధానమునుగురించి ప్రసంగించిరి. సమితిస భ్యులు శ్రీవిశ్వనాధరాయశర్మ గారు, శ్రీనారా యణరావుగారు, శ్రీవెంకటరమణమూర్తిగారు, శ్రీ మృత్యుంజయ సోమయాజులుగారు ఉగాది నిగురించియు, వాఙ్మయసేవనుగురించియు, స మితి స్థాపనోద్దేశములగురించియు శామురచిం చినపద్యములను, కథలనువినిపించి శ్రోతల వా వందింపజేసిరి. ఫలహారముతోను, కృతజ్ఞతాభి వందనములతోను, పంచాంగశ్రవణముతోను సమావేశము జయప్రదముగ ముగింపబడెను.

ఆంధ్రవాఙ్మయ సేవాభిలాషులెల్లరు, సమి తియందుచేరి, సాహిత్యసంబంధమగు పత్రికల ను, గ్రంథములను సంపాదించుచు, పద్యగ ద్యాత్మకమగు రచనలు వ్యాసరూపకముగాగా ని, పద్యరూపకముగాగాని సమితికిసమర్పించు చు, నిమిషపక్షమున వెలువరించుచు, విమర్శిం చుచు వాఙ్మయాభివృద్ధికిని, కవితావికాసము నకును పాటుపడుచుండుటయే ఈసమితి ము ఖ్యోద్దేశములు. వీటినినెరవేర్చుటకై సమితివా రొక సమాలోచన సంఘమునునియమించిరి. సారస్వత భిమానులే సమితియందు సభ్యులు గజేరియు, కవులు, పండితులు గ్రంథకర్తలు, పత్రికాధిపతులు తమరచనలను, పత్రికలనువి మర్శనార్థము సమితికిపంపియు, ఆంధ్రమహాజ నులు, భాషాపోషకులు తమవితరణాభిమానము లజూపియు, మాసమితి భావ్యభివృద్ధికితోడ్పాటు నొసంగ ప్రోద్బలపార్థితులు.

| | |
|---|---|
| బూర్గంపాడు (Via) డోర్నకల్ N.S Ry | ఇట్లు ఇంద్రకంటి వెంకట రమణమూర్తి వ్యవస్థాపకుడు |

### భువనగిరి పఠనమందిరము

భువనగిరి పట్టణవీధిలో నొక పఠనాలయభవ నమందిరమును నిర్మించుటకు శ్రీయుత కొచం కిష్టయ్యగారు తమ తరఫున బాబాదుర కొంఢ ర్మాదాయమునుండి వసతిగల్పింతుమని చెప్పిన ట్లును, ఇందుకు మంచాలవిశ్వనాథం, దుగ్గాల చంద్రయ్యగార్లు శ్రద్ధవహించుచున్నట్లును, వీ రువట్టి ఆరంభశూరులు కాక మందిరకార్యవతుం అవియు ఈవరకు గోలకొండపత్రికలో చూచి తిమి. కాని మందిరనిర్మాణము పూర్తిఆయెనా? లేక వారిప్రయత్న మెంతవరకు వచ్చెను? మల్లి యేమిజరిగెనో తెలియగోరుచున్నాము, గ్రం థాలయ కార్యదర్శిగారైనను తెల్పెదరుగాక.

ఇట్లు
ఒకవిద్యాభిమాని

### ఈరెండుఎద్దులు (కోడెలు) ఎవరివి?

భువనగిరి సమీపమునకు తిమ్మాపురము (జా గీరు)నకు మూడు నాలుగు రోజులక్రింద రెండు కోడెలు ఎక్కడినుండియో పారివచ్చినవి వా టియజమానియెవరో తెలియనికారణమున ఇం కపదిరోజులుచూచినారా రాజా చేయింతురట. వా టియజమానులిప్పుడే భద్రపడుటమేలు.

ఒకబాటసారి

**భగత్ లాల్ నారాయణ్ జీ**
**అత్తరు వ్యాపారులు**
మచ్లీకమాన్, హైద్రాబాదు

మావద్ద అన్నివిధములైనస్వదేశీ అగరు తై లములు, అగరుబత్తీలు, కుంకుమపూవు, చాయ దబ్బీలు జర్దా పెందలగునవి అమ్మబడును.

## గోలకొండ కథలసంచిక

| | | | |
|---|---|---|---|
| చందాదారులకు | వెల | రు | ౧—౦—౦ |
| ఇతరులకు | „ | „ | ౨—౦—౦ |

## కమ్మకులస్థులగు వరులు కావలెను

1. కృష్ణాజిల్లా మామూలు పల్లం భూమి సారవంతమయినది 400 యకర ములున్నూ, ఇదిగాక సంవత్సరమునకు వెయ్యిరూపాయీలు శిస్తువచ్చే వసు తులుకలిగిన కమ్మగృహస్థునకు 15 సం వత్సరములు వయసుకలిగిన ఇరువురు బాలికలు కలరు. వారికి వివాహములు కావలసియున్నది. ఈ బాలికలు తండ్రి పోషణలో యున్నారు.

2. ఈ బాలికలకు ఒక్కొక్కరికి రు 4000 నాలుగువేల రూపాయీల రొక్కమున్నూ రు 8000 ఎనిమిదివేల రూపాయీల కిమ్మతుగలదిన్నీ యకర మునకు రు 1-5-10 శిస్తుమాత్రమే చె ల్లించవలసిన డెల్టా మామూలు పల్లం భూమి మిక్కిలి బలవరచినది. ఒక్కొ క్కరికి పదియకరములు ఆస్తియున్నది.

3. ఈకన్యలను వివాహమాడగోరిన కమ్మయువకులు మంచి ఆస్తిపరులుగా యున్నవారుగాని లేక, ఉద్యోగములు చేయువారుగాని పయినవ్రాసిన స్థితుల కు తగినవరులుగా యున్నవారు తమ స్థి తులను వివరముగా తెలుపుతూ వివర ముల నిమిత్తం,

వివాహ శుభప్రకటన C/o మేనేజరు కృష్ణాపత్రిక, మచిలీపట్టణం, కృష్ణాజిల్లా మద్రాసు ప్రెసిడెన్సీ. అని వ్రాయవల యును.

# తెలంగాణా వార్తలు

## ఖాస్గీ పాఠశాలను మూసి వేయించుటకై ఆజ్ఞ

జనగామ: చ. ౧౦-౪-౩౭—

ఈ గ్రామము నల్లగొండ జిల్లాలోని తాలూకాలలో నొకటయిన జనగామ తాలూకాకు ముఖ్యస్థానమై నైజాం రైల్వే లైనుపైన కలదు

### వర్తక సంఘము

ఇదిమంచి వర్తకప్రదేశము అయిదారు ఫ్యాక్టరీలు కలవు ఎక్కువగా అముదాల, బియ్యపు వ్యాపారము జరుగును. ఇక్కడ వర్తకుల సంఖ్య ఎక్కువే వారికొక సంఘము కలదు. దానికి మ పెద్దిరాజయ్యగారు అధ్యక్షులు. ఈ సంఘమువారు ప్రతి అమావాస్యనాడు రాజయ్యగారి దుకాణములో సమావేశమయి వర్తకమునకు సంబంధించిన విషయములనుగురించి ఆలోచించుదురు.

యీ సంఘమునకు సంబంధించిన ఒక ధర్మశాల కలదు. ఒకసారి, ఏబదిమందికన్న ఎక్కువ అందువుండవచ్చును. చాలా విశాలమైన ప్రదేశము దానికి ముందుకై బజారువైపున కొన్ని మడిగెలు కట్టియున్నారు. అవి కిరాయకు యివ్వబడును. ఏ బాటసారి అయినను యిందు మూడురోజులవరకు వుండవచ్చును. వంట సామగ్రికూడా యివ్వబడును. రాజయ్యగారు మంచి భగవద్భక్తులు. తరుచుగా అన్నదానము చేయుచుందురు. కానివారికి బ్రాహ్మణుల పైననే భక్తి మెండు!

ఈ సంఘమునకు సంబంధించే ధర్మాదాయమను పద్ధతికూడా కలదు. ఆ డబ్బంతయు బీదలకై వినియోగింపబడును.

### ఖాస్గీ పాఠశాలలు

ఈ చిన్న గ్రామమున అయిదారు ఖాస్గీ పాఠశాలలు కలవు, వర్తక వ్యాపారమునకు సంబంధించిన విషయములే యిందు బోధింపబడును. ఈ పాఠశాలలో మ॥ కామేశ్వరరావుగారిదొకటి. ఇందు చదువుకొనువారికి సంస్కృతము కూడా చెప్పబడును తెనుగు వాఙ్మయము లేనందున యివన్నియు సరియైన పద్ధతులలో లేవు. కాని విన్ననేను ఒకవార్త వినవయినది— ఇక్కడి ముంతజంగారికి ఖాస్గీ పాఠశాలలన్నియు వెంటనే మూసివేయించమని ఆజ్ఞ వచ్చినదట— వారు పాఠశాలల స్థాపకులను పిలిపించి మాటలాడుచున్నట్లు తెలిసినది— ముందు పరిస్థితులకు వెట్లుమారునో? పాపము ఉపాధ్యాయులకు ఏమార్గము చూపుదురో!

### సర్కారీ పాఠశాలలు

నాల్గవతరగతివరకు బోధింపబడు రెండు బాలికాపాఠశాలలు (హిందూ మహమ్మదీయు) ఒక బాలుర పాఠశాల కలదు— ఇవి కొంతవరకు బాగుగానే పని చేయుచున్నవి— కాని హిందూ బాలికాపాఠశాలయందు బాలికల సంఖ్య బహుస్వల్పమని వినిపించినది— ప్రభుత్వమువారు కొంత వేతనమునిచ్చి ఉపాధ్యాయుని నియమించినప్పటికి, ఆ మెంగారిజంటి విద్యాలాభమును పొందక పోవుట స్థానికుల పొరపాటు— నిర్బంధ విద్యావిధానమే వున్న యీ స్వల్పసమయమున తగు లాభము కూడా గలిగెడిది—

### అమెరికన్ బ్యాప్టిస్టు మిషన్

మైమిషన్ వారి డీల్లకు యిది ముఖ్యప్రదేశము ఇచ్చట, "క్రైస్తవ ఇన్‌స్టిట్యూటు" అని ఒక పాఠశాల కలదు— ప్రథమములో యీ పాఠశాల సికింద్రాబాదులో నుండెడిది— రెండు సంవత్సరముల క్రితము యిచ్చట ఒక పెద్ద భవనమును పాఠశాలకై కట్టిరి— దీనికై దాదాపు ఏబదివేలు ఖర్చయినది— దీని నిర్మాణమునకై అమెరికా దేశనివాసులైన ప్రిస్టన్ గారు ఒక లక్షరూపాయలు దానమిచ్చిరట— ఇదివారి మాతృరయిన కీ॥శే॥ రూ. క్నేస్టనసతిగారి జ్ఞాపకార్థము కట్టబడినది— భవనపూర్తయినవెంటనే సికింద్రాబాదునుండి మిడిల్ ట్రెయినింగుస్కూలు ఇందు మార్చబడెను. తరువాత హైస్కూలు చేసిరి— మదరాస్ సిస్టము ప్రకారము యిందు విద్య బోధింపబడును— విద్యార్థుల, విద్యార్థినుల సంఖ్య రెండువందలకు పైన కలదు— యిందు "కోఎడ్యుకేట్" పద్ధతి కలదు— ఈ సంవత్సరమే మన విద్యాశాఖవారు పరిశీలించి ఉర్దూకు ప్రాముఖ్యతనిచ్చిన ఎడల రికగ్నిషన్ (హాయిస్కూలుకు) యిచ్చి సహాయము చేయుమని చెప్పిరట— గ్రామమునుండికూడా కొందరు విద్యార్థులు వెళ్లి యిందు చదువుకొందురు. విద్యార్థులకు, విద్యార్థినులకు ప్రత్యేకమైన హాస్టళ్లు కలవు— స్కూలుకు తగినంత ఉపాధ్యాయ సంఖ్య కలదు— తాలూకాలో అక్కడక్కడ దీనికి సంబంధించిన పాఠశాలలు కలవు— మత ప్రచారమునకై కొందరు ప్రచారకులు కలరు— వీరి ప్రచారము బాగుగా నే జరుగుచున్నది—

### పారిశుధ్యము

ఇక్కడ లోకల్ఫండు కమిటీ కలదు— ఎంతో కాలమునకు మొన్న మొన్న అక్కడక్కడ దీపస్తంభములు నియమించిరి— రోడ్లు, సందులు శుభ్రపరుపబడవు— పాతగ్రామమునందు అడుగు బెట్టుటకష్టము. మురికికాల్వలు సరిగా లేవు కనుక నె కాబోలు తరుచుగా యిక్కడికి ప్లేగు వచ్చుచుండును—

### స్థానిక ఉద్యోగస్థులు

తాలూకాలో వుండవలసిన ఆఫీసులన్నియు యిక్కడ కలవు. దాదాపు ఆఫీసర్లందరు మంచివారు. ఆఫీసరుల క్లబ్బు ఒకటి కలదు— ప్రతి సాయంకాలము వీరందరుకూడి వినోదముగా కాలము గడుపుచుందురు— రేడియో కూడా కలదు— కాని వీరందరు క్రొత్తబస్తీలో నుందురు కనుక, గ్రామపు సస్థాయిస్థితి చక్కగా తెలియదు— లేకున్న యిందరు మంచి ఉద్దేశ్యములు కలవారుండి ప్రజల ఆరోగ్యమును విచారించరనిన ఆశ్చర్యకరము?

### గ్రంథాలయము

ఇక్కడ యువజనసంఘము, ఒక గ్రంథాలయము కలదు. కొన్ని సంవత్సరములకు పూర్వము కొందరు యువకులు కలిసి దీనిని స్థాపించిరి— తరువాత మన రాష్ట్రమందలి అనేక గ్రంథాలయములకు వచ్చిన గ్రహపాటు దీనికి వచ్చెను— ప్రస్తుతము యిది ఈ హీనస్థితియందున్నది— మూడు నాల్గు వందల పుస్తకములు, ఒక బీరువా కలదు— యీ బీరువాలు కామేశ్వరరావుగారి ఖాస్గీ పాఠశాలయందొక మూలపడియున్న నేకాని సక్రమముగా నడుచుట లేదు— పత్రికలు రావు. స్వంతభవనము కూడా లేదు— మొన్న, ఆంధ్ర మహాసభాధ్యక్షులు తదితర ప్రముఖులు వచ్చి గ్రంథాలయమును చూచి క్రమమైన పద్ధతులలో నుంచుటకై ప్రోత్సహించినట్లు తెలిసినది— ఎన్నికలు కూడా జరిగినట్లు వారి తీర్మానము ద్వారా తెలిసినది— కాని, నాటినుండి గ్రామము నాటకమును వేవారిబోలె పాలిమారదాలెననటయుండబద్ధము లేదు— అందువల్ల ఎట్టిమార్పును కలుగలేదు— వల్లి ఒకరైనను అటుతిరిగి చూచినట్లు లేదు— నేను గ్రంథాలయమును ప్రత్యేకముగా పరిశీలించి ని మ॥ కా॥రా॥ గారు యిదివరకు ప్రయత్నించి విసిగినట్లు నా కాడికి— యిక్కడి డిపో మ్యానేజరుగానున్న మ॥ ॥ నారాయణరావుగారితో ముచ్చటించగా కొంతకృషిచేసెదనని వాగ్దానమిచ్చిరి— ఇది సంతోషకరమయిన విషయము— తుదకు, ఆసభాధ్యక్షులు జరిపిన ఎన్నికలు సరిగా లేనందున, మరల ఎన్నికలు జరుపుటకును గ్రంథాలయమును పాఠశాలనుండి తీసి ప్రత్యేకముగా ఏర్పాటుచేయుటకును, మరల శ్రీరామనవమినాడు సమావేశము కావలయునని తీర్మానింపబడెను— గ్రంథాలయపు పత్రికల విషయమైకూడా ఆలోచనలు జరిగెను— మ॥ సెట్టి నారాయణగారు "గోలకొండ" పత్రిక గ్రంథాలయమునకు పేర యిచ్చుటకు ఆమోదించిరి—

వీరు యువకులు— నల్లగొండయందుకూడా కొంత సేవచేసియున్నారు— వీరు దీనిపునరుద్ధరణకై తప్పక పూనుకొందురుగాక.

### సంవత్సరాది సమావేశము

మ॥ నా॥రావుగారి, మ॥ కా॥రా॥ గారి, తదితరుల కృషివలన సంవత్సరాది సమావేశము జరుపబడెను— స్థానిక విద్యావంతులు, వర్తకులు అందు పాల్గొనిరి— ముఖ్యముగా గ్రంథాలయ పునరుద్ధరణవిషయమై ఆలోచనలు తీవ్రమైన చర్చలు జరిగెను— తదితర పత్రికలలో, ఆంధ్ర, రయ్యతు ము॥ తెప్పించవలయునని కొందరభిప్రాయపడిరి— అందుకై చందాలు వేయబడెను— యిదిగాక గ్రంథాలయపు మహాచందాలుకూడా కొందరభిమానులు వేసిరి— గ్రంథాలయపు ఏర్పాటు జరుగునంతవరకు పఠనాలయమును జరుపుచుండుట కందరు ఆమోదించిరి— అంతటితో సమావేశము విలిపివేయబడెను— స్థానికులు యిదే ఉత్సాహము చూపి, గ్రంథాలయమును ఒక చక్కని మార్గమునకు తెత్తురని నానమ్మిక— స్థానికవ్యాయవాదులలో, మొదటినుండి గ్రంథాలయముతో సంబంధమున్నవారు మ॥ రాజరెడ్డిగారు వీరు వయస్సునుబట్టి పెద్దవారైనను ఉత్సాహమున, యువకులకన్నను యింకాముందుగానుండదగినవారు— వీరివంటివారే నెల్లుట్ల నరసింహారావుగారు కోపుచ ప్రీస్ల, మ॥ నా॥ రావు, కా॥ రావు గార్లు తదితరులు కలసి; విద్యామొదలగు విషయములందు ఎంతో వెనకబడియున్న జనగామతాలూకా ప్రజలను, ప్రస్తుతస్థితికి తెత్తురుగాక!

## ౬౦ మంది క్రైస్తవులు, హిందూమతమును స్వీకరించుట

### ఉగాదినాడు హరిజనులకు హిందూ తత్వమును బోధించుట

(విలేఖరి)

గోకినేపల్లి ఈ॥ చై॥ శు॥ ౨ సో

పదిహేను యిరువై సంవత్సరముల క్రిందట ఈ గ్రామము మాలవాండ్లు క్రైస్తవమతము నవలంబించినారు— హరిజనోద్యమము నాటినుండియు యీ గ్రామ సంస్కర్తలగు హిందుయువకులు, హిందూమతములోనుండిన హరిజనుల నైతికాభివృద్ధికి ప్రబోధము చేయుచున్న సమయములో క్రైస్తవులుకూడవచ్చి వినుచుండువారలు— ఆంధ్రహిందువులకు పవిత్రమైన ఉగాదినాడు కొందరు హిందుయువకులు హరిజనులకు హిందూధర్మమును బోధించుచుండగా క్రైస్తవమతమునకు జెందిన మాలవారు, మా పూర్వమతమైన హిందుమతమును స్వీకరించగలమని ఒక ప్రమాణపత్రమును సంస్కర్తలగు హిందువులకు సమర్పించుకొనిరి. అప్పుడు హిందూధర్మవిధి ప్రకారం హిందువులకు మంగళకరమైన కుంకుమను వారిది నొసటను ధరించి హిందూమతమును స్వీకరించిరి— సంస్కర్తలగు హిందుయువకులు హరిజనాభాను వ్రాసుకొనగా ౧౩ కుటుంబములగువారు స్వీకరించి మొత్తం పురుషులు స్త్రీలు, పిల్లలు సహా సుమారు ౬౦ మంది హిందుమతమును స్వీకరించినట్లుగా తెలియుచున్నది—

ఈదిగువ కొందరి అంగుష్టములతో సమర్పించిన ప్రమాణపత్రములోని సారాంశము—

### ప్రమాణ పత్రము

"మేము మాలజాతికి జెందినవారము మేము పూర్వమునుండి సనాతనమగు హిందూమతావలంబులము— మధ్య అన్యమతమగు క్రైస్తవమతమును మా బుద్ధిరాహిత్యముచే అవలంబించితిమి— సమస్తమతములకు సనాతనమైన హిందూమతము సత్యము, నీతిధర్మము— ఏకదేవోపాసన అనగా ఒకడే దేవుడనియు నమ్మట మొదలగు హిందూ ధర్మములు ఇతరమతములకు తీసిపోదని మాకు దృఢమైన నమ్మకము కలిగినది— హిందూమతముకన్న ఇతరమతములో విశేషమేమియు లేనప్పుడు మా వంశపారంపర్యమైనట్టిదియు, మాపితృపితామహకాలమునుండి ఆచారానుకూలమైనట్టియు వేదసమ్మతమైనట్టియు సనాతనమైనట్టియు, సత్యశౌచ అహింసాదిధర్మముల తునికిపట్టయిన హిందూమతమే పరమపవిత్రమైనదిగా మేమందరము తలచి తిరిగి మాతొల్లిటిమతమగు హిందూమతమే మా స్వమతముగా స్వీకరించుచున్నాము— వేదవాక్యమగు నారాయణ, గోవింద, రామకృష్ణ ఇత్యాది నామములను ఇకముందు మేము నామకరణము సరించుకొనగలము. ఇకముందు హరిజనులను సనామములతో మెలుగెదము. యెవరి ప్రోత్సాహము మరియు బలవంతము లేకుండా మా ఇచ్చికబుద్ధితో మేము హిందూమతము స్వీకరించుచు ప్రమాణము చేయుచున్నాము.

ఇట్లు

తో. పుల్లయ్య, తో. వెంకటేశ్వర్లు, తో ముత్యాలు, తో వీరా, తో.రామా, యు. గురువులు, ము.నాగా, పె పిచ్చాయా.

## పెదవంగరలో ఉగాది సమావేశము

ఈ గ్రామము నల్లగొండజిల్లాలో జనగామ తాలూకాలో చేరినది— ఈ తాలూకాయందు యీ సంవత్సరము సకాలమున వర్షములు పడి, పునాస మాగిపంటలు సమృద్ధిగానున్నవని చెప్పవచ్చును— పశువులకు మేతయు త్రాగుటకు నీరు సమృద్ధిగా లభించుచున్నది— వరిపంటలు మొత్తముమీద బాగుగపండినవి— మొత్తముమీద వేరుసెనగ విస్తారముగా పండినది— ఈ గ్రామమునందున్న ఖాన్గి పాఠశాలలో పాధ్యాయుడు యీ ధాతృనామ సంవత్సరముననే పాండురంగభజన కీర్తనలు అను చిన్న పొత్తము వ్రాసి అచ్చువేయించినారు— ప్రతివారికి వుచితముగా యిచ్చుచున్నారు—

### ఉగాది సమావేశము

ఈశ్వరనామసంవత్సర శుద్ధ పాడ్యమిదినమున పంచాంగశ్రవణానంతరము యీ గ్రామమందుగల పాండురంగభజనమందిరమందు సమాజికులచే అద్వితీయముగా భజన జరుపబడెను— ఈ సమాజమునకు గోపిపల్లయ్యగారు భజనమందిరము దానము చేసిరి— ప్రతిశనివారము భజన జరుగును గ్రామస్థులలో చాలమంది వచ్చేయుదురు—

## గాలి, రాళ్లవానలవలన పైర్లనాశనము

(విలేఖరి)

గాలిపల్లి తేది. ౮-౭-౪౬ ఫ.

౧౫ దినములనుండి రోజుకు కొన్నిగ్రామము లచొప్పున పెనుగాలితోను, వడగండ్లను గురియుటచే ఈజిల్లాలో ననేక గ్రామములలో వరి పైరు పొత్తిగా అక్కరకురాకుండ నాశనమొందినవి- ప్రతిదినము ఆకాశమున మబ్బులు దట్టముగా వ్యాపించి వర్షమెప్పుడో యెప్పుడో కురియునను ఇలోపచేయుచుండుటచే రైతులు అడుగడుగునకును భయభ్రాంతులగుచుండిరి- రోజు కొకదిక్కునుండి వడగండ్లు వరిపైరు సాంత ముగ నాశనమైనవి. ఘోరవార్తలువినబడి రైతులమనసుల నిట్టటు ఊగిసలాడించుచుండె ను- ఒకదినము సాయంవేళ [కరీంనగరంతాలూకా] కటుకూరు, కొదురుపాక, సముద్రలింగాపురము [సిరిసిల్లతాలూకా] మున్నగుగ్రామములలోను, ఇంకొకదినము బంపపల్లి, దానికి సమీపగ్రామములలోను, వేరొకనాడు ఎలుగందుల, చింతకుంట, మానసాపురము, ఆరెపల్లి, మానకొండూరు [కరీంనగరంతాలూకా] గ్రామములలోను, మరొకనాడు రేపాక, దానికిసమీపముగ్రామములలోను, వడగండ్లుపడి పైరునాశనమొందినవి- ఇట్లు వంతులక్రమ మేర్పాటయినట్లు క్రమముగా ప్రతిదినము ఒక్కొక్కప్రాంతమున రాళ్లవానలుకురిసి పండిన వడ్లు విత్తులు పొత్తిగా రాలిపోవుటయేకాక గడిమీద పొల్లుపొల్లుఅయి కొడుపలిబట్టి కోయరానంత ఘోరముగానష్టమైనవి- కొన్నిగ్రామములలో రాళ్లు పెద్దగాపడుటచే సాంతమును చిన్నగాపడుటచే చాలవరకును నష్టముకలిగినది-

ఇట్లు క్రమముతప్పకుండ రోజుకొకదిక్కునుండి హృదయవిదారకమైన వార్తలు వినవచ్చుచుండుటచే తమపైరులే యెక్కడనష్టపడునో నని భయముచేనరిపైరుపచ్చిగా నేయున్నను కంకిమొదటివిత్తులు పాలుపోసి గట్టిపడకున్నను కోసవిత్తులతోనే సంతృప్తిపడి ఇక్కడికింతేలాభముగదా! రాళ్లుపడినచో ఈమాత్రముగూడదక్కదని ఈగ్రామము రైతులు పైరు కోసుకొని ఆందోళనమును తీర్చుకొనిరి- ఇట్లే యితరగ్రామముల రైతులును చేసినారని తెలియుచున్నది- ఇట్లు విత్తులన్ని బలపడకముందే కోయుటచే సాటికభాగమైనష్టమైనది- ఆకాశమున మేఘములు దట్టముగాక్రమ్ముకొని అవిశ్రాంతముగా మెరయుచు యురిమినప్పుడెల్లరైతులహృదయగతమగు ఆందోళన, విచారము, భయము, ఆతురత వారిముఖములపైస్పష్టముగాకన్పడుచు చూపరులకు కడువిషాదముగొల్పుచుండెను-

వడగండ్లవలననిపష్టమునకుగరియైన, గ్రామము ల రైతులు పిల్లమొదలుకొని పెద్దలవరకును మొగావకొంగ చెట్టుకొని కంటిమంటికినేకధారగాబోరున నేడ్చిరి- వీరియవస్థ ఘోరాతిఘోరభరింపరానిది- వారిహృదయములలో నెన్నిభావములుపుట్టి ఉద్రేకముజెందియుండెడ్పించినవో యెవరూహింపగలరా! ఆహా యేపంట నాశనమైనదేశస్సునట్లు చెల్లించుటాయనియే కాదు, నిత్యవసములకటువు మొదలగువానికి అప్పుదెచ్చిపెట్టుబడి పెట్టితినే. ఏమిబెట్టియప్పుదీర్చుట? అప్పుయిచ్చినవాడు ఎక్కడ దసీగ్గుదీయునోయనిమాత్రమే కాదు, ఈనాగుగైరుమాసములనుండి కాయకష్టముచేసి ఎండయనకనీడయనక చలికోర్చి యెండకోర్చి పడినశ్రమంతయు వ్యర్థమయ్యేనే యనియే కాదు నాయిల్లాలికి "అవ్వ! బువ్వ" "నాయనా! బువ్వ" యని తమచుట్టుముట్టిరిగి యేడ్పించుచుండు బిడ్డలకు ఏమితినబెట్టుదును? నేనేమితిందును? అనుసమస్య ముఖ్యముగా రైతులహృదయముల కలచివైచి యేడ్పించుచున్నది- వారియీసమస్యను పరిష్కరించువారెవరు? శిస్తును మాఫీయిచ్చుటలో అధికారులలోభత్వము చూపుచుందురేకాని రైతులపై దుర్భరస్థితివాడు దృష్టినివేయరు? పైనపేమాత్రమునష్టమైనను రైతుకదగొప్పదెబ్బయే, తీరనినష్టమేయనిభావించరు- ఈస్థితిలో రైతులకుస్వానము జరిగినకష్టము తొలగునటుకల్ల- కావున దయామయులగు ప్రభుత్వమువారు బాధితగ్రామములలో ఎక్కువ, తక్కువ నష్టమను భేదమును గమనింపక పాంతముశిస్తుమాఫీయిచ్చి పొత్తిగానష్టమైనవారికి తకావి అప్పులిచ్చి రైతులయెడ తమకుగలసహజకరుణను చూపుదురుగాక!

---

## శ్రీరామకృష్ణాంధ్ర పఠనాలయ ఉగాది ప్రత్యేకభజన

(విలేఖరి)

తెల్లమద్ది ౬-౭-౪౬ ఫ.

ఈగ్రామమున దేవాలయములేదు. గుట్టపైన శ్రీవెంకటేశ్వరస్వామి శ్రీ హనుమాను విగ్రహములుకలవు, ఈగ్రామమున ఈదేవతలను పూజించువారెవ్వరులేక, చెత్తతో శోభాయమానమైనవిగ్రహములు పూజలేనిగుళ్లవలె పాత్రితపడిపోయినవి.

నేడుసోమవారము సంవత్సరాది ఉగాది హిందువులగొప్పపండుగ కావున శ్రీరామకృష్ణాంధ్ర పఠనాలయపక్షమున శిథిలావస్థలోనున్న విగ్రహముల వర్ణపరిశుద్ధిముచేసి విగ్రహముల కలంకారముచేసి శక్తికొలదిభక్తితో స్వల్పాహారములు నివేదింపబడినది.

ఇచటి పురాతనపద్ధతి ఏమన, భగవంతునకు నివేదింపబడిన శేషాహారములు, హరిజనులకు అర్హతలేకుండెను. కాని పఠనాలయపక్షమున ఉగాది సందేశము తెల్పుచు ప్రత్యేకభజనచేసి, భగవంతునికి ఆరగింపుచేసిన శేషాహారములు అందరితోసహా హరిజనులకు (అస్పృశ్యులను మాలమాదిగలందరికి) జాతిభేదములులేక పంచిపెట్టబడినది.

---

## మాల మాదుగులపై గ్రామాధికారుల నిర్దయ

[విలేఖరి]

కద్పర్తి ర ఖుర్దాదు

హైదరాబాదు ఆంధ్రజాతీయ మహాసభపక్షమున శ్రీయుత యస్. ఆర్. బాలయ్యగారు ౨౦ ఆర్దిబెహస్తునాడు హైదరాబాదునుండి ప్రచారమునకై బయలుదేరి ఆత్రాఫుబల్దా జిల్లాలో షాబాదుతాలూకాలో ఎగమామిడి, కొత్తగడి, ఆలంపల్లి, మొమిన్పేట, అత్తెల్లి, మదనపల్లి, చించల్లిపేట, పులిమామిడి, పొల్పుమామిడి అనుగ్రామములలో సంచారము చేసిరి. అక్కడ హరిజనుల స్థితిగతులనుకనుగొనిరి. ఈగ్రామములలో గ్రామాధికారులు హరిజనులయెడ చాల నిర్దయగానున్నట్లు తెలిసినది. వెట్టిచాకిరినుండి ఈహరిజనులు విడుదలబొందలేక యున్నారు. దయామయులైన ప్రభువుగారు ఎంతఉదారమైన ఫర్మానుజేసినను, గ్రామాధికారులు వాటిని పాటించుటలేదు. మాలమాదుగులడిగినను నిర్లక్ష్యము. ఈవెట్టిచాకిరి చేయనపుడు కాయశుద్ధికూడ ఒక్కొక్కప్పుడు జరుగుచున్నట్లు తెలిసినది. ఒక్క ఉదాహరణచూడుడు. పెండ్లికై తెచ్చిన ౧౦౦ రూపాయలఅప్పుకు వడ్డీక్రిందికిగాను ౮ ఏండ్లకష్టము చేయించబడుచున్నది.

### పరశురామ ప్రీతి

కద్పర్తిలో ౪ఖుర్దాదు గురువారమునాడు ఉదయము ౧౦గం.లకు ఒక మాదిగఇంటిలో పిల్ల నిప్పుచేసి ఎచటికో వెళ్లిపోయినపుడు ప్రమాదముచే నిప్పురవలు ఎగిరియుండవచ్చును- గుడిసెలుకాలిపోయెను. ౫-౬ మాలవారల ఇండ్లును ౨ మాదిగవారలఇండ్లును కాలెను. పెడ్డిగల్ అను ౫—౬ ఏండ్లబాలుడు కాలిపోయెను.

---

### సంవత్సరాదిసమావేశము

(విలేఖరి)

ఏడుట్ల; ౯-౭-౧౩౪౬:—

ఈగ్రామము జటప్రోలు సంస్థానములోనిది. ఈదినము ఈగ్రామములో సంవత్సరాదిపండుగ మిక్కిలివేడుకగా జరిగెను. ఇక్కడరెండుపాఠశాలలుగలవు. ఒకటిసర్కారి పాఠశాలయు, మరియొకటి ఖాస్గీపాఠశాల ఈపాఠశాల విద్యార్థులందరు గ్రామచావడిలో జనసమక్షమున సమావేశమై పలువిషయములనుగురించి శక్త్యనుసారము ఉపన్యసించిరి. జనులుపద్యార్థులను పూలమాలలతో బహూకరించిరి. సర్కారిపాఠశాలలో విద్యాభ్యాసము బాగుగాకానందున గ్రామమువారు వెంకటరెడ్డిఅను ఉపాధ్యాయుని తీసుకొనివచ్చి ఖాస్గీపాఠశాల ఏర్పాటుచేసుకున్నారు. ఈఉపాధ్యాయులవారు బాలుర విద్యాభ్యాసముకొరకు బహుశ్రద్ధతో పాటుబడుచున్నారు. అందుచేసర్కారి పాఠశాలకన్న ఖాస్గీపాఠశాలయే మిక్కిలిఅభివృద్ధిలోయున్నది.

---

## ప్రకటన

ఇందువలన సమస్త వ్యవహారస్తులకు తెలియపరచడమేమనగా అక్కినేపల్లి పుల్లయ్య నాకు సంబంధించిన మధిర సోండపహాడు-నిజాం యిలాకా-మరియు తునికిపాడు, జయంతి త్రిపురారు తాలూకా, కృష్ణజిల్లాలో నున్న జిన్నింగు అయిల్ రయిసు-ప్రెసింగు మిల్లుల మరియు బెజవాడలోని దుకాణములో నా వయిపునుంచి యేజంటుగా నియమింపబడి పనిజరుపుచుండెను. కొన్ని కారణములవలన అతనిని నాకు సంబంధించిన పనులలోనుంచితొలగించ నయినది-కావున ముందునుంచి అతనునాపైపు నుంచి యేవ్యవహారమును కూడా జరుపుటకు అధికారికాడని అతనిచే యేవ్యవహారమయినను దాని లాభ నష్టములు మరియు దాని బాధ్యతతో నాకు యేవిధమయిన సంబంధం వుండజాలదని యిందువలన సమస్త వ్యవహారస్తులకు తెలియజేయడ మవుచున్నది.

ఇట్లు
పింగిలి వెంకటరామారెడ్డి
దేశముఖు వడ్డేపల్లి-వరంగల్.

---



---



---

గోలకొండ పత్రిక

ధాతనామ సం॥ర చైత్రశు॥౧౨

గురువారము

# సంవత్సరాది సమావేశములు

పూర్వసంచికలో నొకచోనియందు సూచింపబడినటుల పలుప్రాంతములలో సంవత్సరాది సమావేశములు జరిగి యుండుట ముదావహము. గోకినేపల్లిలో ఉగాదినాడు స్వేచ్ఛపై ౭౦మంది పూర్వము హిందూ మతములోనుండి క్రైస్తవులైనవారు తిరిగి హిందూమతమును స్వీకరించిరి. తెల్లమద్దిలో శ్రీవేంకటేశ్వరస్వామి దేవాలయమున హరిజనులు ప్రసాదము గ్రహించుటకు ఇదివరలో అర్హతలేకుండెను. అట్టిపురాతనమైన ఆచారమును స్థానికప్రజలే ఉగాది పండుగకు మాపత్రికయందు చేయబడిన సూచనల మేరకుతొలగించి, ప్రసాద వినియోగమందును, భజనయందును సవర్ణులతోసహా అందరుకలిసి పాల్గొనిరి. బూర్గంపాడులో ఆంధ్రవాఙ్మయాభివృద్ధికై ఆంధ్రవాఙ్మయసేవాసమితి యనునదొకటి స్థాపించబడెను. భువనగిరి, జట్ప్రోలు సంస్థానములోని ఏదుట్ల, పెదవంగర, జనగామ, మున్నగు మరికొన్ని గ్రామములనుండికూడ ఉగాదిసమావేశములు జరిగినట్లు వార్తలు వచ్చినవి. ఒకచోట జీర్ణగ్రంథాలయ పునరుద్ధరణ ఆలోచనలును, ఇంకొకచోట విద్యాభివృద్ధి ప్రయత్నములకై ప్రబోధమును ఉగాది సమావేశములందు జరిగినవి. ఇట్లు ఈసారి ఉగాది ఏవరింట వారిపండుగలకై గాక, సంఘసేవాలోచనయందు వినియోగించబడుట చాల సంతోషించదగినవిషయము. ముఖ్యముగ హరిజనులయెడ పురాతనముగ చేయబడుచున్న అనాచారమును తొలగించుటను గూర్చి ఒకగ్రామమునందుండియైనను వార్తవినుట అదృష్టమునకు సంతోషించవలసియున్నది. తిరువాన్కూరు సంస్థానప్రభుత్వమువారు అస్పృశ్యులనబడువారలకు తమసంస్థాన ప్రభుత్వాధికారమునకు లోబడియున్న దేవాలయము లన్నిటిలోనికి హిందువులతో సమానముగ ప్రవేశించుటకు హక్కులిచ్చియుండ ఇటీవలనే కొచ్చినుసంస్థాన ప్రభువుగారు అస్పృశ్యులనబడువారలు ప్రవేశించు దేవాలయములోనికి పోయివచ్చిన హిందువులెవరైనను ఏదేవాలయములోనికిగాని ప్రవేశించిన ఆదేవాలయము అపవిత్రము అగునని ఒకఆజ్ఞను గావించియున్నారు. ఇటువంటి పరిస్థితులమధ్య మనరాష్ట్రమున ప్రభువుగారును, ప్రజలును హరిజనులయెడ అవలంబించిన ఉదారవైఖరి సంతోషించదగినదికాదా! ఇట్టివిషయములు ఇంకను ఎక్కువగాజరిగినటుల వినగోరెదము. ఇట్లే మనఆంధ్రులు ప్రతి హిందువులపండుగను తమయిండ్లలో పంచభక్ష్యపరమాన్నములు తాము మెక్కుటకుమాత్రమేగాక సంఘముయొక్క యోగక్షేమ విషయములను ఆలోచించి సంఘసేవకు ఉత్సాహమునుపొందుటకు ఉపయోగించుకొనుచుండదగును.

# సుంకపుశాఖ శిక్షణగృహము

హైద్రాబాదు ఖుర్దాదు ౧౫—

సుంకపుశాఖాధ్యక్షులగు మౌల్వీ మెయిదీన్ అహమదుగారు సుంకపుశాఖలో చేసిన సవరణలసందర్భమున నొకశిక్షణగృహము నొకదానినిస్థాపింపనున్నారని తెలియుచున్నది. అందు శాఖకుసంబంధించినవిషయముల అనుభవముకలిగించుటయేగాక కార్యకలాపపద్ధతిగూడా గరపుదురు. ఈగృహము అధ్యక్షులవారి కార్యాలయమందొక భాగమందుండును. వలయుఏర్పాట్లు చేయబడుచున్నవి. సుంకపుశాఖోపాధ్యక్షులగు మౌల్వీ మిర్జాగులాంముస్తఫా [రసా]గారు ప్రధానోపాధ్యాయులుగా నుండి అప్పుడప్పుడు ఉపన్యసించుచుందురు.

# హెచ్చింపు

సదరు మొహతెమీం ఖజానాయగు శ్రీయుత నారాయణరావుగారి ఉద్యోగకాలపరిమితి తీరియుండుటచేతగి ౧౩౪౬ఫ. ఇస్ఫందారునుండి మరిఒకసంవత్సరము హెచ్చించిరి.

# ఆరువందల రూపాయిలు బహుమానము

వెనక సదరుమహాసభలో ఉద్యోగిగానున్న కీ॥శే॥ రషీదొద్దీన్ అప్తులకు రు ౬౦౦లు బహుమానరూపకముగా ప్రధానామాత్యులవారు అనుమతించిరి.

# గోరీరక్షణకు వేయిరూపాయిలు

"హజ్రతు రాబదోరానిఖద్దస్సరా"యొక్క గోరీరక్షణనిమిత్తము రు ౧౦౦౦లు హాలీలు ప్రధానామాత్యులవారు అంగీకరించిరి.

## ఆర్యసమాజ సభ

ఉస్మానాబాదు, ఖుర్దాదు౨౨:—

లాతూరుగ్రామములో ౧౩౪౬ ఫసలి అర్ధిబెహస్తు ౨౨వతేదినుండి ఆర్యసమాజసభ జరిగినది—నెల్లంగ, ఉద్గీరు, బీదరు, బ్రిటిషుప్రాంతములనుండి చాలామంది సభలో పాల్గొనిరి. ౨౬తేదినాడు హోమముజరిగినది—ఈసమావేశములో సనాతనులుకూడా చాలామంది పాల్గొనియుండిరి—వీరుకూడా ఉపన్యసించిరి—వీరి ఉపన్యాసములను ఆర్య సమాజమువారు ఖండించిరి—సనాతనులుప్రశ్నలకు సరియైన ప్రత్యుత్తరమివ్వలేదని తెలియుచున్నది—స్థానిక రక్షకశాఖవారు తృప్తికరమైనఏర్పాట్లు గావించిరి—

# ప్రధానామాత్యునితో హిందువుల మొఱ

హైద్రాబాదు, ఖుర్దాదు ౧౨

నిజాంరాష్ట్రహిందుప్రజల స్థాయిసంఘ వర్గమొకటి శ్రీయుత కాశీనాథరావు వైద్యగారి నాయకత్వమున నిన్నసాయంత్రం ౫.౫౦ని॥లకు, ప్రధానామాత్యులవారి దర్శనార్థమై షాహ్ మంజిల్ వెళ్లిరి.

మంత్రిగారితో సందర్శనసందర్భమున నొకవిజ్ఞప్తిపెట్టుకొనబడెను. అందు, వారు, తమ జనసంఖ్య అధికముగానున్నదనియు, అందుచే మాకు కొన్నిహక్కులు కలిగియుండవలెననియు, మీ మంత్రిత్వసమయమునసే మాయాభీష్టాదుపరిష్కరింపబడవలెననియు నూటికి ౫౦మంది హిందువులకు ఉద్యోగములిప్పింతురని నమ్ముచున్నామనియు వ్రాసియుండిరి.

ప్రధానామాత్యులవారు మిక్కిలి సానుభూతితో వారినిగౌరవించి, "మీ హక్కులగురించి మీరంతగా శ్రమపడవలసిన అవసరములేదు" ని కొంతఆశను స్థాపించిరి.

ఈవిషయమై ప్రభుత్వపక్షమున నొకబహిరంగప్రకటన ప్రచురింపబడునని తెలియుచున్నది.

(ఈహిందువులమొఱను వ్యతిరేకించుచు హైద్రాబాదు "మజలిస్ ఇత్తెహాదుల్ముసల్మీన్" అనుసంఘమువారు ఒకవిజ్ఞప్తిని పెట్టుకొనిరి. వివరములు రాబోవుసంచికలో ప్రకటింతుము)

# బొంబాయినుండి హైదరాబాదుకు ట్రంక్ టెలిఫోన్ సర్వీసు

హైద్రాబాదు; ఖుర్దాదు ౧౨:—

బొంబాయినుండి హైదరాబాదుకు మొట్టమొదట్రంకుటెలిఫోనువార్త ఈదినము ౧౧.౩౦ గంటలకు వచ్చినది. ప్రథమమున బొంబాయి టెలిగ్రాఫ్ డైరెక్టరుగారగు కవేల్ రమణిగారును, మ.ఘ.వ. నైజాంస్టేట్ రైల్వే ఏజంటగు మేజర్ యి.డబ్ల్యు. స్లాటర్ గారును, బొల్లారం ఎక్స్చేంచిద్వారా మాట్లాడిరి.

మేజర్ స్లాటర్ గారు పరీక్షార్థము బొంబాయిలోనున్న నైజాంప్రభుత్వపు ఏజంటగు కమర్ తయార్బ్లీగారితో సంభాషించిరి ధ్వనియొంతతోచక్కగ వినబడినదని మేజర్ స్లాటర్ గారు టెలిగ్రాపు డైరెక్టరుగారి చాకచక్యమునుగూర్చి మిక్కిలి ప్రశంసించిరి.

ప్రజలకయింకా రెండుమూడురోజులలో ఈట్రంక్ టెలిఫోను సర్వీసు ఉపయోగమునకు వచ్చునని తెలియుచున్నది.

# గ్రంథక్రయము

"మజామాసె పురహత్" అనుగ్రంథముయొక్క అయిదువదభాగము ఆరువందలు ఒక్కొక్కటి రెండురూపాయిలచొప్పున ప్రభుత్వముక్రయము చేసిరి.

## శాశ్వితటప్పా

హుమాయను సాగరమందుగల తాత్కాలిక టపాఖానాను శాశ్వితపరచిరి

# న్యాయస్థానము

# హకీం నారాయణదాసు గారి చర్య

ఈఅభియోగ హైద్రాబాదు అల్వాభియోగ న్యాయస్థానములో విచారణచేయబడుచుండెను. అందు శ్రీయుత రామచంద్ర నాయకుగారికే జయముచేకూరినది. కాని, నారాయణదాసుగారు ఉన్నతన్యాయస్థానములో పర్యవేక్షణము (నిగ్రాని) చేయుదురని తెలియుచున్నది.

# జైలు అధికారిని మోసగించిన దళ్లాలు

హైద్రాబాదు ఖుర్దాదు ౯

బలరాము అనునతడు ఒక హత్యాభియోగములో ౧౪ఏండ్లు కఠినశిక్షను అనుభవించుచు వరంగలు సెంట్రల్ జైలునందుండెను. మహమ్మదుఅబక్ అనువాడు, తాను పైరవిచేసి విడుదలచేయించెదనని బలరామునుండి రెండువేల రూపాయిలు తీసికొనెను. బలరామునౌకరియగు షేఖుచాందు మహమ్మదుఅబక్ వెంట ఉంటూవుండేది. ఒకరోజు మహమ్మదుఅబక్ హైకోర్టునుండి యివ్వబడినవిడుదల ఆజ్ఞాపత్రమువలె నొక మురాసిలాను కల్పించి షేఖుచాందుద్వారా వరంగలు సెంట్రల్ జైలు అధికారివద్దకిపంపెను. ఆమురాసిలాలో బలరాము తండ్రిపేరు మరియు శిక్షపరిమితి వ్రాయబడియుండనందున, జైలుఅధికారితంతిద్వారా హైకోర్టువారిలో ఈవిషయము తెలిసికొనగా కల్పితమైన మురాసిలాయని తెలిసినది. ఈ వార్త మహమ్మదుఅబక్ తెలియగనే పలాయనమైపోయి, మరికొన్నాళ్లకు, బలరాముతండ్రిపేరు, శిక్షపరిమితికూడా వ్రాసి ఇంకొకమురాసిలాసిద్ధపరచి, బలరాముపదినెయగు లింగమ్మవద్దికివెళ్లి నేను ఈవిడుదల ఆజ్ఞాపత్రమును సంపాదించితిననియు, దీనికై ౫౦ రూపాయిలు వ్యయమయినదనియు ఆమెను ౫౦ రూపాయిలడిగెను. కాని ఆమెవద్దరూపాయిలు లభించని కారణముచే ఆమురాసిలాను కోపముతో చింపి లింగమ్మ యింటిబావిలో పడవేసివెళ్లిపోయెను. తర్వాత లింగమ్మకొంతమందిని కూర్చి బావిలోనికిదింపి ఆకాగితపుముక్కలు ఒకచో చేర్పించి చదివించితనవద్దపెట్టుకొనెను. ఈ విషయములో వరంగల్లు సెంట్రల్ జైలుఅధికారికిని హైకోర్టువారికిని జరిగినకార్యకలాపములో హైకోర్టునుండి ఖువ్వావాలని మహమ్మదుఅబక్ పరిశోధనకును, స్పెషల్ మెజిస్ట్రేటుకు అభియోగవిచారణను, ఆజ్ఞయివ్వబడెను.

తర్వాత షేఖుచాందును, మహమ్మదుఅబక్ను అరెస్టుచేసి స్పెషల్ మేజిస్ట్రేటుగారి సమక్షమున అభియోగవిచారణ మారంభించిరి. పరిశోధకులతోసహా మొత్తము ౨౨మందిసాక్షులు చాలామకసుకూలముగా వాజ్మూలమిచ్చిరి. షేఖుచాందు మహమ్మదుఅబక్ చేయు మోసకార్యములలో చేరియున్నను అతడువిద్యాహీనుడు, బలరామునౌకరి ఇతనిపై ఏవిధమైననేరారోపణకూడారుజువుకాలేదు. ముఖ్యకారకుడు మహమ్మదుఅబక్ అని తేలుటచే షేఖుచాందును విడుదలచేయుచు, మహమ్మదుఅబక్కు ౧ సంవత్సరము కఠినశిక్షయు, రు ౧౦౦లు జూర్మానా, జూర్మానాచెల్లించనిచో మరిమూడునెలలు శిక్ష అనుభవించవలసినదిగా తీర్పువ్రాసిరి

## ఉపకారవేతనములకు తిరిగి ఉద్యోగములు

వసూల్ అసిస్టాంటు అక్కౌంటెంటు జనరల్ గానున్న మౌల్వీ అతీకాహుసేన్ గారిని సప్లైఖాన్ ముబారికలో సహాయమంత్రిగా నియమించిరి

సంకోప్రశాఖయొక్క కొన్ని పేశాలలో మరియు మహాసాల్లాకాలలో సైనికశాఖయందు ఉద్యోగులుగానుండి ఉపకారవేతనము పొందుచున్న బ్రాహ్మణ ప్రాంతపు ౧౦ మంది నియమించిరి

## ఒకబాలికకు సహాయవేతనము

జహారాతభీ అనునొక డాక్టరుబాలికకు డాక్టరు విద్యాభ్యాసమునకై నిజాం ప్రభుత్వ గారు స్కాలర్ షిప్పును అనుమతించిరి

## పిచ్చివాండ్ల వైద్యశాల

౩౦ లక్షల వ్యయము

హైదరాబాదు ఖుర్దాదు ౧౧

వైద్యశాఖ మరియు ఆరోగ్యశాఖాధ్యక్షుడగు కర్నల్ హార్మువాకర్ గారు పిచ్చి వైద్యశాల స్థాపనావసరముల పేర్కొనుచు శ్రీ ప్రభువుగారికి అంపిన పత్రమును అంగీకరింపఁబడినది ఈ వైద్యశాల వ్యయపట్టికగలన ఇంచుమించు ౩౦ లక్షల రూపాయీలు వ్యయపడునని తెలియుచున్నది పిచ్చివాండ్లను ప్రస్తుతము హైదరాబాదు సెంట్రల్ జైలు నందుంచబడి చికిత్స చేయబడుచుండును

## తంతిశాఖలో మార్పులు

హైదరాబాదు ఖుర్దాదు ౯ —

మన నిజాం ప్రభుత్వమువారు ఇంగ్లాండుకు పోలాశాఖనుండి నొకతంతివిషయఃప్రవీణునొకరిని పిలిపించి ప్రస్తుత తంతిశాఖపద్ధతినిమార్చి నూతనపద్ధతిని అవలంభింతురని తెలియుచున్నది ప్రస్తుతము హైదరాబాదులోగల తంతిబ్యాటరీ ద్వారా నడచుచున్నది కావున ఇదిమార్చి ఆటోమాటిక్ పద్ధతిని ఏర్పడబడును ఈసందర్భమున గ్రామముల్లోకూడ టెలిఫోనుకూడా ఏర్పరచుటకు ప్రభుత్వాభిప్రాయమున్నట్లు తెలియుచున్నది నిరవలంభించు పద్ధతులురెండు మొదటిది పోరాపూజనము కలిపివేయఁబడును ఇందుకువ్యయము సుమారు ౫ లక్షలు రెండవది గుంతకల్లుకును కలుపుదుట దీనికి మూడులక్షల వ్యయము

## షోలాపూరులో నీటి ఇబ్బందులు

గుల్బర్గా, ౫ ఖుర్దాదు —

షోలాపూరులో త్రాగు నీరుకై తల్లడిల్లు చుండిరి ఇటీవలి వర్షములచే కొంతమేలు చేకూరి నది-౧౫౦ నెలకుమాత్రము ఈ నీరు సరిపోవును- లోకల్ బోర్డు పక్షమున గాని, ప్రభుత్వ శాఖపక్షమున గాని నీటి వసతి ఏర్పాటైనను జరిగియుండలేదు-గ్రామస్థులు ౧౦ వేల రూపాయిలు ఇచ్చిన లోకల్బోర్డువారు కొంత చేర్చికొన్నట్లైనగాను నీటివసతి ఏర్పాట్లు చేయబడునని తెలియుచున్నది-కాని, పదివేలు వెలువ్యయపరచినను వేసవికాల మారంభమువరకు వలయునంత నీటివసతి చేయజాలుదుమని ధైర్యము చెప్పువారులేరు కావున మేము డబ్బుయిచ్చుటకు సిద్ధముగలేమని రైతులనుచున్నారు-ఈ పదివేలు మొత్తముపై పంచివేసిన ఎవరికివారు నీటివసతి చేసికొనవీలగునని అనుభవశాలు రనుచున్నారు ఇన్ని చిక్కులచే నీటిసమస్యమాత్రము దినదినాభివృద్ధి చెందుచున్నది- బావులలో నీరెల్లప్పుడుండుటకు సమీపముననే కుంటలు తీయించబడినవి-కాని అవి అంతగా లోను లేకపోవుటచేత వానిలో నీరునిలువ యుండదు- అట్టితరి బావులలో కూడా నీరువుండదు- లోకల్బోర్డు వారే ౧౦౦౦౦-౧౫౦౦౦లో వ్యయపరచి కుంటల లోతుగా త్రవ్వించిన ఎప్పుడో ఈ కష్టములు తప్పెడివని మొత్తము వాదుకమాటయై పోయినది-ప్రస్తుతము మాత్రము అందరును లోకల్బోర్డువారిపై అధారపడియున్నారు-

## పోలీసువారికి పాఠశాల వారి హెచ్చరిక

లాతూరు వార్తలు

లాతూరు, ౫ ఖుర్దాదు:-

ఈసంవత్సరము మొహర్రం పండుగలో పాఠశాలవిద్యార్థులు పాల్గొనరాదని ఇక్కడి ఉన్నతపాఠశాల పక్షమున హెచ్చరించ బడెను-సెలవుదినములలోకూడా పాఠశాలలో ఒక తరగతి తెరువబడియుండి పాఠములు చెప్పబడుచుండెను-ఈపద్ధతిని సహించలేని కొందరు విద్యార్థులు పాఠశాలగోడలపై అవాచ్యమైన వాక్యములువ్రాసిరి. అవి మతవిరుద్ధములుగను అనీతిదాయకముగను నుండెను- ఇట్లు వ్రాసి వారినిపరిశోధించి కనుగొనుటకై పోలీసువారికి పాఠశాలవారు వ్రాసి యున్నారు-ఈ పాఠశాలక్రింది టెన్నిసుకోర్టుకై ౨వందలరూపాయిలు అంగీకరించబడెను-కాని అకోర్టు ఒక దాతచే నిర్మింపబడినది- రజతోత్సవ సందర్భమున ప్రోగుచేసినవిరాళములు మొత్తము రెండువందలు, అందు ప్రస్తుతము ౧౫౦ రూపాయిలుమాత్రమే మిగిలియున్నవి-వీటిలో, టెన్నిసుకోర్టుకై అంగీకరించబడిన ద్రవ్యమును కలిపితే ౫ వందల ౫౦ రూపాయిలను విద్యార్థులు కూర్చుండు స్థలములకై వినియోగపరురని తెలియుచున్నది

### హోలీ——మొహర్రం

ఈగ్రామము విషయములో ఎన్ని అపోహలున్నను ఈ సంవత్సరము హోలీ-మొహర్రం ప్రశాంతిగా జరిగినది-ఏవిధమైన కక్షలు ప్రకోల్పబడకుండుటకుగాను హిందూ మహమ్మదీయ సంఘములను స్థాపించి సంఘ నిబంధనల పాలించినఫలితముచే ఈసందర్భమున ఈ పూరిలోనేగాక, తదితర ప్రాంతములందు జరుగు అల్లరులు రూపుమాసినవి- ౭ మొదలు ౧౧ మొహర్రంవరకు హిందువులందరు పానకమును పంచిపెట్టుటయు, హోలీ ఘూలండీ సందర్భమున మహమ్మదీయులు సహితము పాల్గొని తగుఏర్పాట్లు చేయుటయు జరిగినది-

# కాంగ్రెసువిద్యుచ్ఛక్తి

ఆంగీరసుడు

౧౧-౩-౩౭ తేదిని మీపత్రికాలమ్ములో నేను ఎలక్షను కబుర్లు వ్రాసియుంటిని. దానినిగురించి బెజవాడ-బందరు స్థానమునకు కాంగ్రెసు నెదిరించి ఓడిపున్నుడిన శ్రీ వెంకట సుబ్బారావుగారికి కోపమువచ్చి "కాంగ్రెసు మాయా! లేకవిద్యుద్మహిమా?" యనుసమాధానములు ౨౨-౩-౩౭ తేదీ మీపత్రికలో వ్రాసియుండిరి. శారీరకాస్వస్థతవలన రావుగారికి ప్రత్యుత్తరమిచ్చుటకు సాధ్యముకాలేదు.

రావుగారు తొలుతనే "కాంగ్రెసు బహు రాష్ట్రములలో అందుముఖ్యముగ యీచెన్నరాజధానిలో విజయపరంపరల నొందినమాటనిజమే ఇచట శాసనసభాస్థానముల బహుమంది కాంగ్రెసు సభ్యు లాక్రమించినదినిజమే"-యని అంగీకరించి-కాని యనుచు "ఇదంతయు కాంగ్రెసు విద్యుచ్ఛక్తి మహిమా? లేకమనలో కొందరికైనను అవహించినమాయామోహమా?" యని ప్రశ్న చేసిరి. ఇదిస్వవచనవ్యాఘాతమని రావుగారికి తోచలేదేమో. ఏవో కొన్ని సంగతులు చెప్పిచెప్పి "మనముయధార్థమాలోచించినచో నేటికాంగ్రెసుసీట్లు బుద్బుదప్రాయములని మన (?) మంగీకరింపకతప్పదు . . ." దీనికికారణము "అసలుసంస్కరణచట్టమే నేతిబీరకాయయని మాకాంగ్రెసుమిత్రులు తప్పకయొప్పుకొందురు"-అని చెప్పిరి. ఇంకొకతాను ఓడిపోయిన ఉక్రోషము చల్లారక కాబోలు "ఇంతవరకు బ్రిటిషు ప్రభుత్వాక్రింద ఏకచ్ఛత్రాధిపత్యంగా యేలినజస్టిసుపార్టీకి యీఎన్నికలలో—పాపము' ఏగతిపట్టిందోయిప్పటి . స్వసాంప్రదాయ స్వరాజ్యవిదూరమగు కాంగ్రెసునకు ముందుముందు యింతకంటె అధోగతిపట్టునని జ్యోస్యము చెప్పినచో మీరును మీఆంగీరసుడు క్షమింతురుగాక! . . . ."

ఆసేతుహిమాచల పర్యంతము మహామహులచేతను సామాన్యప్రజచేతను వర్షప్రసాదములాగున ఎన్నబడుచు లక్షలాదిసూత్ర సభ్యులుగల మహాసంస్థ కాంగ్రెసును, పట్టుమనిమని పదిమందియైనా సూత్రసభ్యులులేని ఆంధ్రస్వరాజ్యపార్టీవా రాక్షేపింపబూనుటా?

సూర్యకాంతి మహాతీక్ష్ణమైనది-ప్రకాశవంతమైనదిఅని సర్వప్రజలు చెప్పుచుండ ప్రత్యక్షముగ కనబడుచుండగా అట్లుకాదు అదిచల్లగాను, ప్రశాంతముగాను యున్నదని వితండవాదము చేసినట్లున్నది. భారతవర్షములోని ఏడులక్షల గ్రామములకును కాంగ్రెసుసందేశమందుచున్నది ముప్పదిమైదులక్షల హిందువులకును ప్రాతినిధ్యమువహింపగలిగిన బ్రిటిషు ప్రభుత్వము నెదిరింపగలిగిన-కాంగ్రెసుసంస్థయని అశాంతగోపాలము యంగీకరించియుండగా కాంగ్రెసుకుగల ప్రతిష్ఠ,పలుకుబడిమరింక ఏప్రస్తావింకొయి పార్టీకిలేదని మొన్నటి ఎన్నికలలో రూఢియైనది పరుగెత్తలేక చతికిలబడి "నేటికాంగ్రెసుసీట్లు బుద్బుదప్రాయములు" "జస్టిసుపార్టీకి యీఎన్నికలలో ఏగతిపట్టిందో... ..కాంగ్రెసుకును ముందుముందు అధోగతిపట్టును" అని జ్యోస్యము చెప్పుట అర్థములేనివాక్యములు.

ఒక్క ముఖ్యప్రశ్నకు సమాధానము చెప్పెదను. కాంగ్రెసు దండనీతివిషయమై రక్షణ సేనలఏర్పాటునకై ఎందుకుపూనుకోవలెనని బ్రిటిషుప్రభుత్వము ఇండియానంతయు ఆక్రమించి సరియగుపరిపాలన యేర్పరుపగనే ముందు భారతీయులనుండి లాగివేసినది ఆయుధము. హైదవులలో ఆయుధధారణము సర్వసాధారణమైనచో తముపాలనమున కడ్డువచ్చునేమోయని వారిభయము. కానియీసంగతివారు బహిరంగముగ చెప్పరు. భారతీయులు సైనికవిద్యలో ప్రవీణులగుట తమకుసమ్మతిమేనందురు. వ్యక్తులుకాక పలుకుబడిలేని రాజకీయపార్టీలు సైనికవిద్యకై కోరుకున్నను ప్రభుత్వము హర్షింతుమందురు. కానికాంగ్రెసువంటిమహాశక్తివంతమైన సంస్థ సైనికవిద్య, సైనికపాఠశాల ప్రారంభించెదమన్నచో గవర్నమెంటువారు తప్పకనిషేధించెదరు. ఇదివరలో ప్రారంభింపబడిన హిందూస్థాని సేవాదళములే అక్రమసంఘములుగా ప్రకటింపబడినవి. ఇదంతయు బహిరంగరహస్యమే. దండనీతినిగురించి యోచింపలేదని సుబ్బారావుగారు ఎత్తిచూపకనే కాంగ్రెసువారికి తెలియును. ఇంకవారిస్వరాజ్య పక్షప్రణాళికనుగురించి పొగడుకొనుచుకాంగ్రెసు ప్రణాళిక . నేతిబీరకాయవంటిదనిరి. రావుగారిపార్టీ ప్రణాళికను ఆచరణలోపెట్టుటకు శాసనసభలో ఆపార్టీమనిషే లేడే. అసలుపార్టీయే నామమాత్రమైనప్పుడు ప్రణాళిక విశేషమేమి? ఇదిఒక పెండ్లికొని గ్రిస్మాచారి కన్యకనుచూచుకోకుండ మహాప్రశస్తమైన సుముహూర్తమును పెట్టించుకొని పెండ్లియగునని ఉరూరి తిరుగుచున్నట్లున్నది

బెజవాడ—బందరులలో కాంగ్రెసుఅభ్యర్థి కోటేశ్వరరావు పంతులుగారికి తొమ్మిదివేలఓట్లురాగా యింకొ పదకొండువేలఓట్లుమిగిలిపోయినవట. నెగ్గడంమాటయటుంచి, వట్టిపలుకుబడికొండు ఓట్లుమాత్రమేవచ్చిన సుబ్బారావుగారు అనిగిలిపోయిన పదకొండువేలనుండి తమకెక్కువటే నిలబడుటకైనా అవసరమైన ఓట్లను సంపాదించుకో లేకపోయిరేమో? పైగాకాంగ్రెసుది"మాయాయుక్తి""కుయుక్తి" "నాటకము" "బూటకము" యనివారు పలుకు విశ్వసించెదరా? హిమాలయము మొదలు కన్యాకుమారివరకు కాంగ్రెసుపేరు మారుమ్రోగుచున్నదే. ఊహవచ్చిన బాలునినుండి వృద్ధులవరకు కాంగ్రెసునకు జోహారు చేయుచున్నారే. ఇదికాంగ్రెసుమహిమగాక మరేమి? దీనినేనేను కాంగ్రెసు విద్యుచ్ఛక్తి యంటిని.

—

# గోలకొండపత్రిక

GOLKONDA PATRIKA

HYDERABAD-DECCAN

The First Telugu Bi-Weekly in Andhra Desa and the leading Telugu Newspaper
of H E H The Nizam's Dominions



Vol. 11. | Thursday 22—4—1937 | No. 93

ఎట్టకేలకు సుభాషచంద్రుడు కారాగార విముక్తుడయ్యెను. మిక్కిలి జబ్బుపడి నేడో రేపో విడుదల కానున్న సమయము. కాని ఫలప్రాప్తి ఫజలుల్ హక్కు గారికి ప్రాప్తించినది హక్కుగారి ప్రధానమంత్రిత్వములో ఏమిచేసినను ఈ యొక్కమాత్రం సుభాసుబాబునుయింటికి జెప్పెను. అప్పుడే బెంగాలు రాష్ట్రీయ కాంగ్రెసువారు సుభాసును అధ్యక్షునిగానుండుమని ఏకగ్రీవముగ కోరుచున్నారు,

* * *

సుభాసుచంద్రునికి సాంబమూర్తిగారనిన అత్యంత గౌరవము-కొన్ని సంవత్సరముల క్రితం బెంగాలువారలంటేర్ల మహాసభ కధ్యక్షతవహించుటకై బులుసు సాంబమూర్తిగారిని పిలచియుండిరి. అప్పుడు కలకత్తాలో సాంబమూర్తిగారికి జరిగిన ఊరేగింపువంటిది యిదివరలో ఒక్క మోతీలాలు నెహ్రూగారికి కాంగ్రెసు అధ్యక్షునిగా జరిగియుండెను. సాంబమూర్తిగారనిన బంగాళీయులలోనే సాధారణముగ గొప్పగౌరవమున్నది. పూర్వము సాంబమూర్తి కాంగ్రెసు కార్యసంఘసభ్యుడుగా నున్నతరి ఎస్. శ్రీనివాసయ్యంగారు, సాంబమూర్తి సుభాసుబాబుగార్లు ఒక్క మాటమీదయుండెడివారు-రాష్ట్రములోని అంతర్వివాదములవలనగాని సాంబమూర్తి భారతములో నుంచి ప్రతిష్ఠ సంపాదించెను- అఖిలభారత హిందూస్థాని సేవాదళమునకు చాలకాలము సాంబమూర్తిగారధ్యక్షులు-

ప్రస్తుత కేరళ రాష్ట్రీయ రాజకీయ మహాసభకు టంగుటూరి ప్రకాశంపంతులుగారధ్యక్షత వహించియుండిరి. ప్రకాశంగారు కాంగ్రెసు కార్యసంఘములో సభ్యుడుగను, సంయుక్త కార్యదర్శిగనుకూడ యుండిరి. కాంగ్రెసు ప్రధాన కార్యదర్శిత్వము పూర్వము న్యాపతి సుబ్బారావు పంతులుగారు తర్వాత కీ॥ శే॥ ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగార్లు మాత్రమే వహించియుండిరి. ఆంధ్రనాయకులలో సంఘీభావమేయున్నచో యింకా గొప్ప యుద్యోగములను సంపాదించియుందురు.

చూపెండి తమిళులు. మద్రాసు రాజధానిలో కలక్టరు హోదాలో యున్నట్టి ఎస్. గోపాలస్వామయ్యంగారు కాశ్మీర దివానుగా ఆహ్వానింపబడిరి. అయ్యంగారిపాటి సమర్థులేలేరా చెన్నరాజధానిలో? కొండి రామమూర్తి పంతులువంటి మహామేధావి ఇండియా మొత్తముమీద కలక్టరులలో లేక అతాహతులో ఏడీ? కాని ఆయనను ప్రతిపాదించువారేరి? సర్ వి టి. కృష్ణమాచారి మొనగాడని తమిళ ప్రముఖులుపొగడి బరోడా దివానుగ సిఫార్సుచేసిరి. ఇప్పుడు ఆకృష్ణమాచారిగారో లేక లిమువానూరు దివాన్ వి. పి. రామస్వామయ్యరుగారో లేకమరొకరో గోపాలస్వామయ్యంగారివంటి "రాజనీతి దురంధరుడు దొరకడు" అని చెప్పియుండవచ్చును. తమిళులు పదవులనట్టి పుచ్చుకొందురు. తెలుగువారు ఒకరికొచ్చిపోవునేమోయని మరొకరుబాధపడి చెడగొట్టుకొనుచుందురు. పట్టాభిప్రకాశంగార్ల యనుయులున్న వివాదములేకుండెటులంధ్రరాష్ట్రమునకు కార్యసంఘ సభ్యత్వమైనావొకుండెడిదేమో.

సంయుక్త నియోజకవర్గములకు హిందూ మహాసభవారు అంగీకరించిరి. కాని జిన్నాగారి

## ఇష్టాగోష్ఠి —

— అంగీరసుడు

ముస్లింలీగు వారంగీకరించరే. ప్రత్యేక నియోజకవర్గములుయున్నచో కులతత్వం యథేచ్ఛగా ప్రకోపింపవచ్చునని వారియుద్దేశము. మొన్నటి ఎన్నికలలో సంయుక్త రాష్ట్రములలో డాక్టరు మహమ్మదు జఫీరుగారొక్కరే కాంగ్రెసుతరపున ఎన్నుకోబడిరి, ఇపుడు రాఫీ అహమ్మదుకిద్వాయిగారు మధ్య ఎన్నికలో పోటీలేక ఎన్నుకోబడిరి. నలుబదిఎన్మిదిజిల్లాల కొక్క మహమ్మదీయుడు కాంగ్రెసు తరఫున నెగ్గెనా? అందుకనియే జవహర్‌లాలుఢిల్లీకన్వెన్షనుసభలో ముసల్మానులు- కాంగ్రెసు అనుదానిని సమస్యగా భావించి యింతటినుండి ఆశాఖలో కాంగ్రెసుప్రబోధము హెచ్చుగా గావించవలెనని గట్టిగా నొక్కిచెప్పెను. సాధారణ జానపదుడగు మహమ్మదీయునికంతగా (ముస్లింలీగు) కులతత్వ ఈర్ష్యలు యుండవనియు, కాని లీగునాయకులే ప్రత్యేక నియోజకవర్గముల నవకాశముగా చేసికొని మతతత్వమును ప్రకోపింప జేయుచున్నారనియు పండితుడుచెప్పెను. ఢిల్లీ కాంగ్రెసు సంఘసభకైనతర్వాత జమయితుఉల్ ఉలేమా సభానాయకులు మహాత్మాగాంధీగారిని, జవహర్‌లాలు గారిని సందర్శించి కాంగ్రెసులో చేరుటకై కొన్ని కోర్కెలు (శారియత్ లాను గురించి ముస్లిం విజ్ఞానరక్షణను గురించి) కోరియుండిరట

* * *

జవహర్‌లాలు ముస్లింసామాన్యప్రజను కాంగ్రెసుతత్వములోనికి దింపుటకై తీవ్రప్రయత్నములు చేయుచున్నాడు. ప్రతి రాష్ట్రమునకును యీసమస్యవిషయమై ఉపసంఘములు నేర్పరచి మహమ్మదీయ సోదరులను కాంగ్రెసు సూత్రసభ్యులుగా చేర్పించుమని తాఖీదులనుపంపెను. అధిక సంఖ్యాకులగు హిందూప్రజానీకంతో ముస్లిం ప్రజాబాహుళ్య సంఖ్య కూడ కాంగ్రెసులో చేరి ప్రభుత్వమునకెదురుగా ౧౯౨౦లో వలె తీవ్రప్రతిఘటనచేసిన స్వరాజ్యము కరతలామలకమే. ౧౯౨౦లో ఖిలాఫతు ఉద్యమమును కాంగ్రెసుతో కలుపుటచేత విశేషసంఖ్యాకులు దమమతీయకారణము చొప్పున కాంగ్రెసులో చేరిరి. కానియిప్పుడు మతకీయకారణము లేదు-కేవల రాజకీయకారణముకొరకై "భారతవర్షము నాది"యను అహంకారముతో (దేశాభిమానవిషయములో మతదృష్టి యుంచుకొనక) యుంచుకొని కాంగ్రెసుపక్షమై కృషిచేయబడు మహమ్మదీయులసంఖ్య ఎంతపెరుగునో చూడవలసియున్నది.

* * *

బ్రిటిషుప్రభుత్వము ఇండియాబిల్లులో చాల అంకెలుబెట్టెను-రాష్ట్రీయ స్వాతంత్ర్యము పేరేగాని గవర్నరుకు గల విశేషాధికారములు చాల పటిష్ఠమైనవి-దీనినిఎట్లు రాష్ట్ర స్వాతంత్ర్యము కపటనాటకమువలె గోచరించుచున్నది-పదకొండురాష్ట్రములలో ఆరు రాష్ట్రములను కాంగ్రెసుశాసనసభ్యులు అధిక సంఖ్యాకులుగా నెగ్గి వశపరచుకొని వివిధ గవర్నరులను తమ విశేషాధికారముల నుపయోగింపమని వాగ్దానమివ్వమనిరి-గవర్నరు లంతసులువుగ లొంగెదరా! మద్రాసులో రాజగోపాలాచారిగారికోర్కెను నిరాకరించెను-అప్పుడు ఓడిపోయిన పార్టీ (జస్టిసు)లో నాయకుడైనసర్-కూర్మావేంకటరెడ్డి నాయుడుగారు మంత్రివర్గము నేర్పరచిరి- ఓడిపోయిన పార్టీలుమద్రాసులో మూడుపార్టీలున్నవి. ౧ జస్టిసుపార్టీ ౨ పీపిల్సు పార్టీ ౩ స్వతంత్రపార్టీ- అన్నట్లు ఏమండోయి' మరచిపోయాను- ఆంధ్రస్వరాజ్యపార్టీయుండి-యీపార్టీతరఫున కొప్పదర్శ ఒక్కడే అభ్యర్థి గుమ్మడిదల వెంకటసుబ్బారావుగారు-(బెజవాడ-బందరుకు)- ఆ ఒక్కడుసెక్యూరిటీకూడ కోల్పోయెను. ఆంధ్రస్వరాజ్యపార్టీ అధ్యక్షుడు భూపతిరాజు వెంకటపతిరాజుగారు పీపిల్సుపార్టీలో ఉపాధ్యక్షుడు. గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు [ఆ. స్వ. ఉపాధ్యక్షుడు] కాంగ్రెసు పార్టీకి కర్నూలుజిల్లాలోపనిచేసెను. ఒకకార్యనిర్వాహకసభ్యుడు పీపిల్సుపార్టీలోచేరి తెనాలి-గుంటూరుకుపోటీచేసెను [పిల్లలమర్రి అంజనేయులు పంతులుగారు]. కాని ఆంధ్రస్వరాజ్యపార్టీ కార్యదర్శిమాత్రము కాంగ్రెసుసంస్థ నెదిరించి నవ్వులపాలయ్యెను.

సర్ కూర్మాగారినెందుకు గవర్నరుపిలచిరనియనవచ్చును. జస్టిసుపార్టీనాయకుడు బొబ్బిలిఓడెను. ఉపనాయకులువెంకటగిరి, బి రామచంద్రారెడ్డి సర్. ఎ. పి. పాత్రోగార్లుకూడ అపజయముపొందిరి. పీపిల్సుపార్టీ అధిపతులుపిఠాపురంతండ్రి,కొనుకుడు, యిద్దరుఉపాధ్యక్షులు పరాజితులైరి. ఇంక గు. వెం. సు. గారు ఏదోనాపాగడిన చల్లపల్లిజమీందారుని పలకరించినవారే కనబడినట్లులేదు. స్వతంత్రపార్టీయంటే అర్థములేనిపార్టీయన్నమాట. ఆంధ్రస్వరాజ్యపార్టీ మద్రాసుకౌన్సిలులో-పాపము అందుచేత ఓడినవారిని తీసుకొనుటమాని ఓడకుండా ప్రభుత్వముచే ఆశ్రయించుకొన్న సర్. కె. వి. రెడ్డిగారిని ప్రధానమంత్రిగా పిలచిరి. వీరిని పెద్దసభ [కౌన్సిలు] లో నియమించిరి. తద్వారాకూర్మాగారి మంత్రిత్వము "శాస్త్రయుక్తమైనది, సర్ కుర్మాగారి మంత్రివర్గము ఆరునెలలకన్న బ్రతికియుండుట కవకాశములున్నవి మద్రాసుశాసనసభ అగష్టురకు సమావేశపరచుట. ఏమిరాష్ట్రీయస్వాతంత్ర్యము?

మద్రాసుమంత్రివర్గములో ప్రధానమంత్రి ఆంధ్రుడు ఒకమురళియాళీ- నల్గురుతమిళులు- మధ్యరాష్ట్రముల ప్రధానమంత్రి శ్రీ రాఘవేంద్రరావుగారు ఆంధ్రుడే- సంయుక్తరాష్ట్రములలో విజయనగరం మహారాజావారితమ్ముడు కుమారరాజాకుమారు ఒకమంత్రిగాతీసికొనబడెను- దొడ్డిదారినవచ్చిన యీమగ్గురి మంత్రిత్వజీవితము ఆరునెలలలోపల-కాదు ఏనాడైనను అంతరించవచ్చును-

* * * *

హిందూమతశాఖలలో ఆర్యసమాజముచాల ప్రాముఖ్యమైనసంస్థ- విగ్రహారాధనవిషయమై వారువ్యతిరేకులైయుందురుగాక హిందువులు నానాటికి తమమతప్రభావమును మరచిపోవుచున్నారు- కనుక సదాచారములను వృద్ధిచేసికొనుటకును, స్వకీయమతప్రపక్తిని సరిగా తెలిసికొనుటకును, హిందువులలోని-అస్పృశ్యతా పిశాచమును పారద్రోలిఅవర్ణశబ్దమును రూపుమాపి హరిజనులను సవర్ణులుగా చేయుటకును ప్రతిమండలములోను ఆర్యసమాజప్రతిష్ఠాపనలు ఏర్పడవలెను- ముఖ్యముగ తెలంగాణములో ప్రతిమండలరాజధానిలోను ఆర్యసమాజసంస్థలు సత్వరముగ స్థాపింపబడునట్లు కేంద్రఆర్యసమాజపీఠమువారు పూనుకొనెదరుగాక!



Printed and Published by G, Ramakrishna Reddy at the Golkonda PowerPress, Hyderabad. Editor K. Balakrishna Reddy